# గోలకొండపత్రిక




ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

REGISTERED No. N. 45 | హైదరాబాదు—దక్కన్. | REGISTERED No. M. 213

సం॥ లము ౨ } విభవ సంవత్సర వైశాఖ బ॥ ౧ శనివారము (౫ మే ౧౯౨౮) { సంచిక ౯౭


## పశుగ్రాసములు—సూచనలు

మాకేటి రంగారావుగారు

పశుమేతకు పనికివచ్చు పంటలు అనేకములు గలవు. పశుగ్రాసమున కుపయోగించు పైరు ఎక్కువ మేత యిచ్చునదిగను, త్వరలో జీర్ణమగునదిగను నోటికి యింపైనదిగను త్వరలో పెరుగునదిగానుండవలెను. తరచు హిందూదేశములో పశుగ్రాసములకు పనికివచ్చు పైరులలో జొన్న చాలముఖ్యమైనది. ఈ జొన్న ఎండిన తర్వాత వేయుటలవాటు సాధారణముగా గలదు. దీనినే మనము చొప్పని వాడుదుము. కొన్ని సమయములందు పచ్చిమీద అవిగా పుష్పించి పాలపాట్టపై నున్నప్పుడు మేపుటకలదు. కొన్ని సమయములందు పుష్పించుటకు ముందుగా పచ్చిమీద జొన్న మేసిన విషముగామారి పశువులను జంపును.

ఈ జొన్నలో తెల్లజొన్న, పచ్చజొన్న మొదలగు వుపజాతులు అనేకములు గలవు. ఈరకములన్నియు సాధారణముగా తొలకరిని వేయుదురు. కొన్ని శీతకాలమున సెప్టంబరు, అక్టోబరు నెలలలో వేసి ఫిబ్రవరి నెలలో కోయురకములు గలవు. కొన్ని రకములు వేసవికాలములో నీటి ఆధారమున వ్యవసాయము చేయునవి గలవు. రైతు జాగ్రత్తగా యుక్తాయుక్తములు విచారించి వ్యవసాయము చేసిన మొత్తము మీద సంవత్సరము పొడుగున జొన్నపైరు చేయవచ్చును.

పశుగ్రాసమునకు పనికివచ్చు జొన్నకు బాగా యింకిపోవు గరపనేలలు మంచివి. తొలకరిని నేలను క్రమముగా రెండు మూడుసార్లు దున్ని జూన్ నెలలో ఒకవర్షము కురిసిన తరువాత విత్తనము వెదజల్లుటగాని లేక గొర్రులలో వేయుటగాని మంచిది. ఎకరమునకు ౨౦ మొదలు ౪౦ పౌనులవరకు విత్తనములు చల్లవచ్చును. ఆకులమీద ఒకటిరెండు సార్లు కలుపుతీసి కొంచెము పైపాటు బెట్టి పుష్పించు సమయమునందు కోయుట మంచిది. ఎకరమునకు ౧౫ బండ్లు బాగా చీకిన పశువుల పెంటవేసి ౧౫౦ లేక ౨౦౦ పౌనులు నైట్రేటు ఆవ్ సోడాతో రెండు పర్యాయములలో సత్తువచేసిన ౧౫౦౦౦ పౌనులు వరకు పచ్చిమేత అనగా ౫౦౦౦ లేక ౬౦౦౦ పౌనుల ఎండుచొప్పను పరిపోవునది వచ్చును. నైట్రేటు ఆఫ్ సోడాతో సత్తువ చేసిన పైరుబాగా పెరుగును.

జొన్న పశులవులకు పచ్చిమీదగాని ఎండిన తర్వాత కట్టలు గట్టిగాని మేపవచ్చును. కర్ర పచ్చిమీద దానిని ,,యన్‌సిలేజి''గా జేసి పశువులకు మేపిన చాల శ్రేష్టము. పచ్చిమీద జొన్న లేతగా నున్నప్పుడు కోసి భూమిలో ఒక గొయ్యితీసి దానిలో జాగ్రత్త బెట్టుదురు. ఈ గోతులనే ,,సైలోను'' లందురు. యన్‌సిలేజి కొరకు గోతులు తీసినప్పుడు అవి మొదటిలో ఒక వరుస ఎండు గడ్డితో 3 లేక ౪ అంగుళములు ఎత్తున గప్పిన జాగ్రత బెట్టిన, మేతలోనికి వర్షము దిగకుండా కాపాడవచ్చును. మొదటిలో (సైలో) సదరు జొన్నలో చెక్కగా ఇముడునట్లుగా వేసి పైన ఒక వరుస ఎండుగడ్డివేసి తర్వాత మట్టితో కప్పవలెను. ప్రత్యేకముగా తయారుచేసిన యీ గోతులలో యిట్లు గ్రాసము జాగ్రత బెట్టినప్పుడు సరిగా సదరు గ్రాసమును మట్టితో కప్పుటకు ముందుగా ఏవిధమైనగాలి లోపల లేకుండా గ్రాసమును యిముడ్చవలెను. అట్లు చేయనియెడల త్వరలో పులిసి వాసనగల్గి రుచిగానుండదు.

పై జెప్పిన రీతిని జాగ్రత బెట్టిన గ్రాసము పశువులు తినుటకు ఎక్కువ యిష్టపడును. ఇట్లు చేయుటచే వేసవికాలములో పచ్చిమేత కావలసి వచ్చినప్పుడు పచ్చిమేత పశువులకు అందుబాటు చేసి వాటి ఆరోగ్యమును వృద్ధిచేయవచ్చును. పాడి పశువులకు వేసిన పాలను తప్పక వృద్ధిచేయును. ఇట్టి మోస్తరుగా పశువులకు మేతకు పనికివచ్చు రూజర్రైను గన్నిగడ్డి. ఏనుగగడ్డి మొదలగు గ్రాసములు అనేకములు గలవు. ఇటువంటి పలురకములు ప్రతిరైతు వ్యవసాయముచేసి వాటి స్వాభావికమును గనిపెట్టి పై జెప్పిన పద్ధతులలో పశువులను మేపిన కొంత దేశమునకు క్షేమము కల్గును. పశువులకు సరియైన మేత జాగ్రతబెట్టుటలేని రైతు వ్యవసాయమును లాభకరముగా జేయలేడు. కష్టపడి పనిజేయు ఎడ్లను క్షుద్బాధచేత పీడింపజేయు రైతు యధార్థముగా బంగారపు గుడ్లను బెట్టు బాతును చంపినవాడగును.

(సమదర్శిని)

## కుక్కలే రైతులు; రైతులే కుక్కలు

జూనగడ్ సంస్థానములోని పరిస్థితులు

జూనగడ్ నవాబుగారి చర్యలు అత్యంత చిత్రముగా నున్నవి. వారికి కుక్కలు పోషుటయందధికమైన ప్రీతి. నవాబుగారి దగ్గఱ యనేకమైన కుక్కలున్నవి. వీటి కొఱకు ప్రతి దినము ఒక వంద మేకలను జంపి వాని మాంసముతో వీటికి భోజనము పెట్టుచున్నారు. ఒక్కొక్క మేకకు నాలుగు రూపాయిలు ఖరీదు కట్టినను దినము ౪౦౦ రూపాయిలు ఖర్చగును. ఈ లెక్క ప్రకారము నెలకు ౧౨౦౦౦ ను

సంవత్సరమునకు ౧ లక్ష ౪౪ వేలును. అయిను. ఈ కుక్కల మాంసము ఖర్చు మాత్రమే, ఇంకను విశేషములు వినదగిన వున్నవి. వీటికి ప్రతి దినము పాలు, బిస్కత్తు, డబల్ రొట్టె ఫలాహారముగా నిచ్చుచున్నారు. ఇంతేకాదు. వీటికొఱకై ప్రత్యేకముగా బంగాళాలుకట్టి యున్నారు. అందవి విహారము చేయుచుండును. వీటికై యనేక సేవకులు పరిచర్య చేయుచున్నారు. మఱియు ని శునక రాజులు ప్రతి దినము స్నానము చేయింపబడును. ప్రతి శునకమునకు సబ్బు వస్త్ర శరీరమును కడుగుదురు.

ఈ కుక్కల శ్మశానమునకై యొక విశాలమైన మైదానము ప్రత్యేకించి యున్నారు. చనిపోయిన కుక్కలను సలువరాళ్లతో గోరీలను కట్టి యా గోరీ పై నీడయుండుటకై చిన్న చిన్న మంటపములు కట్టి యున్నారు.

ఈ సంస్థానము యొక్క ప్రతి సంవత్సరపు ఆదాయము ౭౦ లక్షలకన్న నెక్కువగా లేదు. ప్రతి సంవత్సరము కుక్కలకు మాత్రమే ౪ లక్షలు సుమారు వ్యయమగుచున్నవి. రైతులకు ప్రక్కనెంచి పేదవాండ్లకు సమగ్ర భోజనమన్న యెట్టిదో యెఱుగక మలమల మాడుచుండ ఏ కుక్కలు పూర్వజన్మ మందెట్టి నోము నోచి యుండెనో కదా యింత సుఖపడుచున్నవి!

## విజ్ఞప్తి

సూర్యాపేట సభల విషయమున నిదివఱకె పత్రికలయందు మా పక్షమున ప్రకటనలు ప్రకటింపబడినవి. కాని నీలగిరి పత్రికయొక్క సంపుటము ౬ సంచిక ౩౦ లో ప్రకటింపబడిన గ్రంథాలయాభిమాని యొక్క సూచనలు వప్ప నాహ్వాన సంఘము వారికి మార్గదర్శకములైన సూచనలింకెవ్వరును ప్రకటించ లేదు. పై గ్రంథాలయాభిమాని యొక్క యుపదేశ వాక్యములను మేము కృతజ్ఞతతో స్వీకరించు చున్నాము. మాపై నున్న భారము ఘనమైనది. మాహస్తగతమైన కాలమతిస్వల్పము. మన రాష్ట్రము నందలి దేశాభిమానముగల పత్రికా సంపాదకులును, విద్యాసంపన్నులును సభల విషయమున తమ తమ సూచనలను పత్రికలయందు ప్రకటింప జేసి మాకు కార్యనిర్వాహకయందు చేయూతనొసగి మాపై నున్న భారమునందు కొంత భాగము వహించుటకు సేమతో వినయయుక్తముగా ప్రార్థించుచున్నాము.

జరుగబోవు సభలలో ముఖ్యమైనది ద్వితీయ గ్రంథాలయ సభ గావున మన రాష్ట్రమునందలి యాంధ్రగ్రంథాలయముల వారందరు తప్పక తమ ప్రతినిధులనెన్నుకొని ౧౦ వ తేదీ వఱకు మాకు వారినామముల తెలియ జేయవలయును.

పత్రికాధిపతులును, విద్యాధికులును గ్రంథాలయ సభలో ప్రవేశపెట్టుటకు తగిన తీర్మానములను పత్రికలలో ప్రకటించవలెనని మేము విజ్ఞాపనము చేయుచున్నాము.

ఇట్లు, కొండాటి వెంకటేశ్వరరావు బి.ఏ.
ఆహ్వాన సంఘ కార్యదర్శి.

---

## గ్రంథ స్వీకారము

నం ౧౮ శ్రీ వ్రతరత్నము. కవి. కలచవేటి వేంకటాచార్యులు, ప్రకాశకులు లక్ష్మీ స్టోర్సు, తాడిపత్రి. [మద్రాసు రాజధాని]. వెల ౦—౨—౬.

ఈ చిన్న పుస్తకము తమిళ భాషలో గోదాదేవియను నామాంతరముగల ఆండాళ్ గారిచే రచింపబడిన దానికి తెనుగులోననువాదమై యున్నది. తిరుప్పావై యను మూల గ్రంథమును వెంకటాచార్యులు గారు ౩౦ సీస పద్యములలో తర్జుమా చేసినారు. ఇందు విష్ణువుయొక్క యవతారలీలలు, నందుముఖ్యముగా శ్రీకృష్ణుని శృంగారలీలలు వర్ణింపబడియున్నవి. శైలి లలితముగా, మనోహరముగా నున్నది.

# పరిణామయుగము

## టర్కీయున్నగు దేశములలోని మార్పులు

**టర్కీ స్త్రీలు:—**

టర్కీ స్త్రీలలో నేడు గలిగినమార్పు యుద్ధమునకు పూర్వమువారున్న స్థితితో పోల్చినచో నత్యద్భుతముగ నుండును. యుద్ధమే నిజముగ వారి స్వాతంత్ర్య సాధనమయినదని చెప్పవచ్చును. పురుషులెల్లరు సంగ్రామమునకు పోయియున్నప్పుడు టర్కీదేశపు స్త్రీలు అన్ని వ్యవహారములందును తిప్పక చేయిజేసికొనవలసిన అవసర మేర్పడినది. ఆ సమయముననే వారు పర్దాల మరుగునుండి బయటకువచ్చిరి. ముసుగులను తీసి పారవైచిరి. వెంట్రుకలను గిరజాలుగ కత్తిరించుకొనిరి యూరోపియనుల మాదిరి హ్యాటులను పెట్టుకొనుటను నేర్చిరి. అన్నింటికన్న సినిమాలయందుకూడ పాల్గొన నారంభించిరి. ఆఫీసు ఉద్యోగములనునిర్వహింప మొదలిడిరి. ఈ విధముగా నేడు టర్కీ స్త్రీలే సర్వసాధారణముగా నన్ని విషయములకు సంబంధించిన యభివృద్ధియందుగూడ ప్రపంచమందలి మహమ్మదీయ సోదరీమణుల కెల్లరికి నాదర్శప్రాయులై యున్నారు.

కాని యుద్ధమునకు ముందు వీరికుండెడి కట్టుబాటులు స్త్రీలకునులేవు. పదిపాలికలుగా నున్న పుడే ట్లున్నను, ౧౨ సంవత్సరములు వచ్చునప్పటికి ప్రతిబాలికయు ముసుగునుధరించవలసినదే. "టిచర్ చాఫ్" అనబడు పాదవుపాటి బురుఖావంటి జాతీయ ముసుగులను ధరించవలసినదే. పరదా అవలంబించవలసినదే. అట్లు కాని యెడల నాబాలిక యొక్క కుటుంబమునకంతకును అవమానము, మీదు మిక్కిలి అధికారులవలన శిక్షవిధింపులుకూడ వచ్చుచుండెడివి. ఆ దినములలో పురుషులుకూడ ఫెజ్ టోపీలను ధరించవలసినదే గాని హ్యాటులను పెట్టుకొనుటకు వీలులేదు. ఇట్టి స్థితి ప్రబల యుండగనే యుద్ధము వచ్చినది. ౧౯౧౮ వ సంవత్సరమున అర్మిస్టీసు జరిగినది. అనంతరము మరల వెంటనే టర్కీకి గ్రీకుతో యుద్ధముజరిగినది సుల్తానును పదభ్రష్టునిగా జేయుట, జాతీయ ప్రభుత్వమేర్పడుట వెంట వెంటనే తటస్థించినవి జాతీయ ప్రభుత్వమునకు కెమల్ పాషా నాయకత్వము వహించి ప్రస్తుత పరిణామవీథిక పునాదులు వైచెను. స్త్రీస్వాతంత్ర్యోద్యమమునకు గూడ నాతడే తోడ్పడి యెన్నియో అవకాశములను గల్పించెను. ఉద్యోగరీత్యా ఫెజ్ టోపిని విసర్జించి ప్రప్రథమమున హ్యాటును ధరించినది కెమల్ పాషాయే. ఆతని నాయకత్వముక్రింద టర్కీ ప్రభుత్వమే, యంతటినుండి స్త్రీపురుషు లెల్లరు హ్యాటులను ధరించుటకు తీవ్రముగ ప్రోత్సహింప మొదలిడెను పిమ్మట ప్రభుత్వమే ఫెజ్ టోపిలను ధరించుటను నిషేధించుచు శాసనము గావించెను. అంతియేగాక స్త్రీలు పురుషులతో సరిసమానముగ బ్రదుకుటకువచ్చి స్వాతంత్ర్య వాతావరణము దిరుగాడుటను కెమాలు పాషా తీవ్రముగ ప్రోత్సహించెను. అంతటితో నాకొక్కటిగ నన్ని విధములగు స్వాతంత్ర్యములను యొట్టివిరోధమును లేకుండ టర్కీ స్త్రీలందరు గలిగిరి. విద్యావంతులు మున్నగు నున్నతతరగతులకు చెందిన స్త్రీలెల్లరు నేడు హ్యాటులను ధరించుచున్నారు. మధ్యతరగతికి చెందినట్టియు రైతు సంఘమునకు చెందినట్టియు స్త్రీలుహ్యాటులనందరు ధరించక పోయినను చేతిరుమాళ్లవంటి పలురకముల రంగుసిల్కు గుడ్డలను తలకు కట్టుచున్నారు. మరియు స్త్రీల విద్యావిషయమున గూడ ప్రభుత్వము వారివలన నెక్కుడు శ్రద్ధ తీసికొనబడుచున్నది స్త్రీలు విద్యాలాభమునుండి, ఉద్యోగములయందును, వ్యాపారములయందును, ఇతర పనులయందును చేరి పురుషులతో పాటుగ రాజకీయములందు సయితము పాల్గొనుచున్నారు. గతవత్సరమున ఫిబ్రవరి మాసములో స్త్రీ లసౌందర్యపు పోటీకూడ కాన్‌స్టాంటు నోపిలు నగరమున జరుపబడినది. ఇట్టి ప్రయత్నము కొన్ని వత్సరములకు పూర్వముననే యయినచో నెంతటి లజ్జావిహీనమయిన కార్యముగ నైన నెంచబడెడి దనుటకు సందియము లేదు.

**చీనా స్త్రీలు.—**

చీనా స్త్రీలలో గూడ నేడట్టి పరిణామము చాల గలిగినది. చీనా స్త్రీ యొక్క పాదములను కురుచగ చేయు ఆచారము సమసిపోయినది. విద్యావంతురాలగు ప్రతి స్త్రీయు పురుషునితో సమానస్వాతంత్ర్యము ననుభవించుట క్రమముగ జరుగుచున్నది. పూర్తిగ యూరోపియను దుస్తులను ధరించుచు యూరోపియనులతోను, స్వజాతీయులతోను పురుషులతో గలిసి తిరుగుచున్నది క్లబ్బుల కేగుచున్నది. వినోదములయందు పాల్గొనుచున్నది పురుషులతో గలిసి నాట్యము సయితము చేయుచున్నది. ఇట్టి నూతన పద్ధతులన్నియు నేడు చీనా స్త్రీ లోకమున అత్యాచారము లని పించుకొనుటలేదు. మీదు మిక్కిలి నాగరకతా చిహ్నములుగా నెంచబడుచున్నవి, నూతన భావోత్తేజితలగు స్త్రీ లెల్లరు నేడు పురుషుల రాజకీయోద్యమము లను శక్తివంచన లేకుండ తోడ్పడుచు దేశవిమోచనమునకై పాటు బడుచున్నారు.

**జపాను స్త్రీలు—**

జపాను స్త్రీ లోకమునందు సయితమిట్టి విధముగు మార్పేనదికి గలిగినది, మూడు మూలమున్నదే కొలదిమంది కాలము గడచిన స్త్రీలో పూర్వపు ఆచారములను సిద్ధాంతములను అనుష్ఠించుచు వర్తించుచున్నారు గాని ఆధునిక కాలపు స్త్రీ లెల్లరుగూడ పాశ్చాత్యవిధులను ఆచారములను పూర్తిగ నలవాటుపడి దినదినాభివృద్ధిని గాంచుచునే యున్నారు. ఇటువంటి నూతన జాతీయ పద్ధతులను విదేశాచారములను జపాను నాయకులు కొందరిప్పుడొకింత తీవ్ర నిరోధముగ నున్నను ఈ వా

ణావతి దానివలననట నదియే అప్పుడే ఆగాక పోవుచున్నదనియే చెప్పబడుచున్నది.

ఎడారుల జనులు:—

ఆధునిక కాలపు క్రొత్త క్రొత్త నిర్మాణములతో సౌకర్యములతో ఎడారులయందుండు అనాగరిక జనుల జీవితమందు గూడ మార్పులు గలుగుచుండ పైన జెప్పిన విశేషముల కంతగా నాశ్చర్యపడవలసిన అవసరముండదు. అరబ్బీషేకులు నేడు ఫోర్డు మోటారు కారులలో ఎడారులయందొక మూలనుండి మరొక్క మూలకు ప్రయాణము చేయుచున్నారు. ఆఫ్రికా మధ్యప్రదేశములయందుండు నీగ్రోలకు సయితము మోటారు ప్రయాణములు నేడు మంచినీళ్ళ ప్రాయమయి పోయినవి. అన్నిదేశములలో గూడ పూర్వాచారములన్నియు నవీన పరిణామముల ప్రోలమోకరించి పడి మారిపోవుచున్నవి. ముఖ్యముగ నాగరికతాభివృద్ధికి ప్రతిబంధకమయిన స్త్రీల దుస్థితి ఈ పరిణామ యుగమున పటాపంచలగుచున్నది. ఇట్టిది లోకకళ్యాణమునకు సూర్గమే యని ప్రాజ్ఞులెల్ల రభిప్రాయపడుచు సంతోషించుచున్నారు.

[లిటరరీ డైజెస్టు]

---

## వ్యవసాయకుల స్థితులు

ప్రప్రథమమున వ్యవసాయకుల కర్తవ్యమును గురించి చర్చింపవలయును. ప్రస్తుత పరిస్థితుల ననుసరించి వీరి కర్తవ్యము నిర్ణయించుట దుస్తరము. ప్రపంచమునందన్ని దేశములకంటె భారతదేశ వ్యవసాయకులు, మిక్కిలి నీచముగను, నిర్లక్ష్యముగను, చూడబడుచుండుట అనుభవ సిద్ధము. మన దేశమునందు, వ్యవసాయపు వృత్తి హేయమైనదిగను, అధమాధమమైనదిగను, ఎంచబడు చున్నది. అన్నివృత్తుల వారికి లోకువైనవారు వ్యవసాయకులే. వ్యవసాయకుల కష్టము, పరిశ్రమ, సంపద, నానాముఖముల ద్వార విరివిగ నాశనమగు చుండుట చూచుచున్నాము. రాత్రింబవళ్లు ఎండవానలకు, ఓర్పుతో దేహకష్ట మొనర్చుట తప్ప; వీరికి మరే మేలాటి అధికారములు లేవు. స్వతంత్రత లేదు. వ్యవసాయకుల పైన అందరు, యధికారము ఎర్పాటుచేయ వచ్చును. మేమిట్టి అజ్ఞులకు బద్ధులమై యుండుట కొరకే భగవంతుడు మనలను సృష్టించినాడు కాబోలు నని కృషికుల అభిప్రాయము. రైతుల వలన సర్వ సౌఖ్యముల నొనగూర్చు కొనుటకును, చాలిన పనులను చేయించు కొనుటకును, మనకందరికధికారము గలదని తదితర వృత్తుల వారందరు నిష్కర్షగా తీర్మానించుకొని యున్నారు. ఇట్టి సంకీర్ణ స్థితిలో, వ్యవసాయకుల కర్తవ్యము నెటుల నిర్ణయింప వలయును? ఒకవేళ నిరూపించినను తామాచరించుటకు, బహుకాలమునుంచి పరాధీనమున కలవాటుపడి, నున్నపోతులవలె కష్టము చేయుట తప్ప, వ్యవసాయకులకు స్వతంత్రత ఎక్కడిది? ఒకానొకదారిని, ఉట్టి యూడిపడినట్లుగానుండగ నైజమే, వేయి శిరములొక్క పెట్టున వానిశిరముపై నాట్యమాడి, రోమ నిర్మూలన మొనర్చ మొదలిడును. అదరింపులు, బెదరింపులు, హుంకృతి హుంకృతుల మధ్యనే వాని గ్రుడ్లెళ్లుటకు సందియముండదు.

ముఖ్యముగా మానవ హక్కులను గ్రహించుటకు రైతుల కవకాశము లేదు. అట్టి వసతులు లభించినను, సమయానుసారముగ వినియోగించుకొని లాభము గడించుకొనుటకు తెలివితేటలసలే లేవు.

ఇట్లెన్ని విధముల అణచబడి యుండి, విద్యలేక, స్వతంత్రత లేక, బాధ్యత లేక, అభివృద్ధి మార్గ మసలే లేక, దినదినమున కశాంతిని, దుఃఖమును, ఓరిమితో భరించుకొని; జీవచ్ఛవముల వలె జీవించు చుండినను, సత్వర విజ్ఞానాభివృద్ధి కెంచు భారత దేశమున, స్వతంత్రాభిలాష ప్రబలముగా నుండు యీకాలమందు, మానవ ప్రపంచమునకు మేలొనగూర్చు చుండెడి వ్యవసాయకులు; తమ యభ్యున్నతి, ప్రపంచ శాంతి నభిలషించి అవసరమైన కర్తవ్యములను నెరవేర్చ వలసిన సమయ మాసన్నమై యున్నది. ఇక నూరకుండుటకు వీలులేదు. ఈ సమయమున తమ కర్తవ్యమేమో కృషికులు యోచించి నిర్ణయించుకొని, తదానుసారముగ ధైర్యముతో వర్తించి దాని వలన కలుగు సత్ఫలమును తామనుభవించి ఇతరుల కనుభవింప జేయుట ముఖ్యాతి ముఖ్యము.

కాబట్టి, వ్యవసాయకులారా! మూర్ఖపు పూర్వాచారములను వదలి ధైర్య మవలంబించి, నవీన పద్ధతుల నాచరింపుడు. మీకష్ట నిష్ఠురములను, సాధ్యమైనంత విపులముగను; గంభీరముగను ప్రభుత్వమునకు నివేదింపుడు. వ్యవసాయపు నవీన విషయములందును, వ్యవసాయ విధి నిర్వహణమందును, వ్యవసాయాభ్యున్నతి కొరకు, విజ్ఞాన వేత్తలు బోధించు బోధనలను, వ్రాయు వ్యాసములను, రచించు గ్రంథములను శ్రద్ధతో వినుడు. ఓపికతో చదువుడు విసుగులేక దీక్షతో గ్రహించుడు. వ్యవసాయాభ్యున్నతి కొరకు బహిరంగ పరుచు ప్రదర్శనములను తిలకించి, కృషి సలుపు వ్యవసాయపు క్షేత్రములను, పాలించు గోరక్షణ శాలలను చూచి, వివిధ లాభప్రదములగు విషయములను గ్రహింపుడు. తదానుసారముగ మీరు మీ వ్యవసాయమునందు మార్పు చేయుడు.

ఇక మీరొనర్ప వలసిన ప్రాథమిక కర్తవ్యములను ఇంకొక మారు వ్రాయదలచి యున్నాము. చిత్తగింపుడు.

ఇట్లు
ఎస్. ఆర్. రావు.

---

## గద్వాల సిద్ధాంతి గారి కుప్పిగంతులు

ప్రపంచమునందుగల వివిధదేశములందు జరిగెడు నిజమైన వృత్తాంతములను దెలియజేసి జన సామాన్యమునకు దోహదమొనర్చునది వార్తాపత్రిక గాని కల్పితవృత్తాంతములను తెలియజేసి లోకమునకు సంకటము గలిగించునది వార్తాపత్రిక కాదుగదా! ఎంతవాడైన నసత్యపు మాటలవలన వహ్నితగ్గినట్లు, కల్పితవృత్తాంతములుగల వార్తాపత్రికా ప్రచారము తగ్గుటకు సందియము లేదు. కల్పిత వాక్యముల ప్రచురించు పత్రికాధిపతికిని తత్పోషకులకు దత్సహాయులకు దదభిమానులకు పాపంబు దప్పపుణ్యంబించుక లేదుగదా! ఈ సంగతులను గోలకొండ పత్రిక కొంచమైన యోచింపక శ్రీశ్రీ విద్వద్గద్వాల సంస్థానాధీశ్వరియగు శ్రీమంతు మహారాణీ ఆదిలక్ష్మమ్మ అమ్మయ్యగారు తమరాజ్య పట్టాభిషేక మహోత్సవమున భూసురోత్తములచే రామకోటి పారాయణము గావింపజేసి, మత్త్రయభూసురోత్తములకు సమారాధనసంభావనాది సత్కారములను, బీదసాదలకు నన్నప్రదానము గావించుచు దైవికముగ కోటలోని గడ్డివాములు పరశురామ ప్రీతియయినను దానిని లెక్కింపక తాముచేయుచున్న సత్కార్యమును మహోత్సాహముచే బరిపూర్తి గావించిరి.

ఈ బ్రాహ్మణ సమారాధనము, రామకోటి పారాయణమునకు సంబంధించినదని యెంచుక నెరుంగక కోటలో గడ్డివాములు పరశురామ ప్రీతియైనందునకు సిద్ధాంతిగారు నిర్ణయించిన శాంతికి సంబంధించిన బ్రాహ్మణ సమారాధనమని యేకుటిలాత్ముల వ్రాతలనమ్మి సత్యాసత్యముల నెరుంగక పత్రికాధిపతియగు గోలకొండ పత్రిక కాగాకర యనను ప్రచురించుట బహుశోచనీయ కార్యమని నేను, చెప్పనేల? గద్వాలసంస్థానాధీశులు పూర్వమునుండి వివిధ దేశములందలి సమస్త విద్వాంసులును కవులును జ్యోతిశ్శాస్త్ర నిపుణులును సంగీత పారంగతులును మొదలుగాగల వారల సంభావనాదులచే సత్కరించుచుండును, దైవభక్తియందును, రాజ్యపాలనమందును, నిరంతర బ్రాహ్మణ సమారాధనమందు ప్రఖ్యాతివహించినవారు. తమ పూర్వుల విధంబున ప్రకృతము గద్వాలసంస్థానమును పాలించుచున్న శ్రీమంతు మహారాణీ ఆదిలక్ష్మమ్మ అమ్మయ్యగారు నిరంతరము సత్కార్యములు గావించువారలగుటచే రామకోటి పారాయణానంతరము సద్విధిగా జరిపిన బ్రాహ్మణ సమారాధనమును గడ్డివాములు పరశురామ ప్రీతియైనందున శాంతిగా నొనర్చిన బ్రాహ్మణ సమారాధనయని భ్రాంతివ్రాసిన లేఖకుడును ప్రకటించిన పత్రికాధిపతియు శ్రీరాణీగారిని క్షమాపణ గోరుట యెంతయు ప్రశంసనీయము.

ఇట్లు
దైవజ్ఞ, రత్నం, మహావాది
విశ్వనాథ సిద్ధాంతి, మంథెన్న.

[ క్షమార్హుని వ్రాతల వలన నీతని తెలివితేటలు వెల్లడియైనవి. ఇట్టి పండితపుత్రునికి ప్రత్యుత్తరమే అవసరము లేదు. గో. సం.]

## వివిధ విషయములు

### షియ్యాలకు సున్నీలకు తగాదాలు

హిందూదేశము యొక్క పశ్చిమోత్తర పరగణాలయందు కోహాటు జిల్లాలోని మహమ్మదీయులయందు షియ్యాలకు సున్నీలకు రెండు శాఖల వారికి తగాదాలు కలుగుచున్నవి. ఈ తగాదాలకు పరిష్కారము చేసి సమాధాన మేర్పరచుటకు అధికారులు యత్నము చేయుచున్నారు.

### యువకులకు సందేశము

కాంకాయినందు జరిగిన యువకుల సభలో శ్రీయుత సుభాష్ చంద్రబోసుగారిట్లు ఉపన్యసించిరి:—

పెద్దలు సాధించలేని సమస్యలను యువకులు సాధించిరి.

ముసలి హృదయుల దౌర్బల్యమే యువకుల బలియగుచున్నది.

యువకుల సమాజములో నొక సభ్యుడనుగా వచ్చుచున్నాను. భారత దేశములోనే గాక ప్రపంచములో నన్ని దేశములలోను యువకుల యుద్యోగ జరిగినది. మానవజాతి క్రొత్త సమస్యలను క్రొత్త దృక్పథమున జూడ ప్రయత్నించుచున్నది. ఇతర దేశములలో యువకులను నేను చూచినాను. యువకులకు సంబంధించిన సమస్యలలో వారొక క్రొత్త పద్ధతి నవలంబించుచున్నట్లు నాకు తోచినది. పెద్దలు పూర్వతరములవారు కొలాను సరణముగా ప్రవర్తించక, నెమకంజ వేయుచున్నారని వారి యభిప్రాయము. పెద్దలు సాధించలేని సమస్యలను యువకులు సాధించినారు. జర్మనీలో పెద్దలు నిరుత్సాహము జెందిన కొట్లు పారజూచిన రోజులలో యువకులే ధీరత్వమును జూపి పనిచేసిరి. యువకు లెన్నడును నిరుత్సాహము జెందరు. అది ప్రకృతికే విరుద్ధము. ముసలికను గోచరించుకొని క్రొత్త పద్ధతులను, నూతన నోత్సాహమును యువకుల కుండుట సహజము. నా కుజూపి భారత దేశమే ఒక ప్రపంచమని తోచుచున్నది. ఇచ్చట అన్ని జాతులు అన్ని మతములు సామరస్యమున నుండవచ్చును. వివిధ భాషలు, కలసి యుండవచ్చును, జాతీయ అంతర్జాతీయతకు విరుద్ధము కాదని మనము రుజువు చేయగలము. ఇట్టి స్థితి మనకు రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యము లభించిన గాని కలుగదు.

### మహారాష్ట్ర రాష్ట్రీయ మహాసభ

సుభాష్ చంద్రబోస్ గారి అగ్రాసనాధిపత్యమున మే 3 తారీఖున జరుగనున్న సభకు పూర్వక మే ౧౨వ తేదిన జాతీయ పతాకోత్సవము జరిగెను. ఆహ్వాన సంఘాధ్యక్షులు శంకరరావు మహాదేవ్ పరాంజపేగారు చాల మంది ప్రజల యెదుట పతాకము ప్రేలాడ వేసిరి.

మే ౨ తేది సాయంత్రము పూనా మునిసిపల్ సంఘమువారు శ్రీయుత సుభాష్ చంద్రబోసు గారి గొప్పతనమును, మహాత్యాగమును, వారు స్థానిక ప్రభుత్వమునకు చేసిన సహాయము నుగ్గడించుచు నొక సన్మాన పత్రము సమర్పించిరి.

బోసుగారు ప్రత్యుత్తర మొసంగుచు పూర్వము భారత దేశమున స్థానిక ప్రభుత్వ సంస్థాపనలు వృద్ధి గాంచెననియు, ఆపదలుల మీదనే మన మిప్పుడు కృషి సలుప వలెననియు చెప్పెను. భారత దేశ స్వాతంత్ర్యమునకై ధైర్యము తోడను పట్టుదల తోడను పోరాడునని సభికులను కోరెను. తానుగూడ స్వాతంత్ర్య పోరాటమున నొక భటుడననియు, అందరు వట్లే యుండవలెననియు కోరెను.

మహారాష్ట్ర రాజకీయ మహాసభ ౨౨ వ సమావేశము పూనాలో 3 వ తేదినాడుదయము ప్రారంభమయ్యెను. వివిధ జిల్లాలనుండి చాలమంది ప్రతినిధులు ప్రేక్షకులు స్త్రీలు పురుషులు వచ్చియుండిరి. జాతీయ గీతములతో కార్యక్రమము ప్రారంభమయ్యెను.

ఆహ్వాన సంఘాధ్యక్షులు ఎస్. ఎం. పరంజపే గారు స్వాగతోపన్యాసము చదివిన పిదప ఎన్. సి. కేల్కారుగారి సూచనపై సుభాష చంద్రబోసుగారు అధ్యక్షత వహించిరి. సుభాష చంద్రబోసుగారు బెంగాలులో దేశబంధు దాసుగారి తరువాత నాయకత్వము వహించిరి. బోసుగారు కార్యశాలులు. పెద్దవారిని పడగొట్టు ప్రభుత్వ విధానమునకు బోసుగారే ముందుగ గురియైరి. ఇండియనులు సివిలు సర్వీసునందు సభ్యులు ఇండియనులు గారు. సివిలుగ [శాంతముగ] నుండరు. సర్వెంటులు [నౌకరులు] గారని ఒక వాడుక కలదు. బోసుగారే దాని సత్యమునకు భంగము కలుగకుండుటకై రాజీనామా నిచ్చిరని కేల్కారుగారు నుడివిరి. ఆర్. పి. కరండీకరుగారు తదితరులు బలపరచిరి. బోసుగారు అధ్యక్షోపన్యాసము నొసంగిరి.

### అవసర ఆంధ్రరాష్ట్ర ప్రాథమిక పాఠశాలో పాధ్యాయ మహాసభ

మే ౫ వ తేది శనివారము ఉదయము ౭ గంటలనుండి గుంటూరు టౌను హైస్కూలు భవనములో శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావు యం. ఎ. యం. యల్. సి. గారి యాజమాన్యమున జరుగును. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయు లందరు ఆహ్వానింప బడుచున్నారు.

## సకలాంధ్ర కవిసమ్మేళనము

### భీమునిపట్టణమున మే ౧౫ వ తేదిని జరుగును

సకలాంధ్ర కవిసమ్మేళన మొకటి జరిగించు నగత్యము కలదని దేశమున పలువురు తలచుచున్నారు. కాని నేటివరకు నట్టి సదవకాశము మనకు లభించి యుండలేదు. ఈ సంవత్సరము శ్రీమదాంధ్ర భారతీ తీర్థ సాహిత్య విభాగము పక్షమున కవిసమ్మేళనము జరిగించుటకు నిశ్చయింప బడినది. మే ౧౫ వ తేదీ మధ్యాహ్నము కవిసమ్మేళనము భీమునిపట్టణము విశాఖపట్టణ మండలమున జరుగును సాయంకాలము సమాపించి భావికార్యక్రమము నేర్పరచుట కవుల గ్రంథము లను ముద్రించు భాగములను చదువుట కావ్యభాషా పరిణామమునుగూర్చి ప్రసంగములు కవితారీతుల గూర్చి వ్యాఖ్యలు మొదలగునవి యుండు జరుగును. ఎన్నుకొనబడిన వారిలో నొకని మేధావిత్వము నిని సభ్యులు నిర్ణయించుటతో వారికి ఆంధ్రభారతీ తీర్థపక్షమున "విభూషణ" బిరుదపట్ట మొసంగబడును.

అనేకములగు పండిత సమావేశములు జరిగినవి కాని ఇదివరకు నిట్టి కవిసమ్మేళనము లాంధ్రదేశమున జరిగియుండలేదు. సకలాంధ్ర కవిసమ్మేళనమున కిది యే మొదటిసారి. కాలవ్యవధి స్వల్పమగుటచే ప్రత్యేక ఆహ్వానము లంపలేక పోయినందులకు మన్నించి ఆంధ్రకవు లెల్లరు నీసమావేశమునకు తప్పక దయచేయ ప్రార్థితులు. సభికులు వారికి భీమునిపట్టణమున శ్రీశ్రీ విజయనగరము మహారాజా సాహేబుగారు భారతీతీర్థద్వారా ఆతిథ్యము నొసగెదరు. ఎమ్. ఎస్. ఎమ్. రైల్వేనుండి వచ్చేయువారు విశాఖపట్టణమున దిగిన ఇటునుండి మోటారు బస్సులు కలవు. బి. ఎన్. రైల్వేనుండి వచ్చువారు విజయనగరమున దిగుట మంచిది. అటునుండి బస్సులు కలవు. అట్లు దయచేయువారు ముందుగ తెలియజేయ ప్రార్థన. అధ్యక్షుల నామము అనతికాలమున ప్రకటింపబడును. ఈ సమ్మేళనమును గూర్చి ఆంధ్రకవి పుంగవులు తమతమ యభిప్రాయములను సూచనలను దెలుప ప్రార్థితులు.

పురిపండా అప్పలస్వామి
సకలాంధ్ర కవిసమ్మేళన
విశాఖపట్టణము. కార్యదర్శి.

---

## హిందూస్థానము

### ౧

---

### ప్రపంచమందంతటను కనిష్ఠ దేశమైపోయినది.

---

[కే. ఆర్. ఆర్. శాస్త్రిగారు మాపరణా రిపోర్టు]

---

ఎచ్చట జూచినను హిందూస్థానము సామ్రాజ్య కిరీటమందు అమూల్యమైన వజ్రమనియు, తాజమహలువంటి యద్వితీయ నిర్మాణమున్నదనియు భాగడుచుందురు.

కాని ప్రపంచమంతటిలో బీద దేశమగు నీ హిందూస్థానము లోకమంతటిలో హెచ్చు విలువయైన ప్రభుత్వమున కంటకట్టబడినదని యెవ్వరును చెప్పరు. ఏ గ్రంథమునైనను జూడుడు. ఇయర్ బుక్కులలో నూరురి జీవన చారిత్రములు వ్రాసిన హిందూస్థానపు మహాపురుషుల నలుగురి జీవితములైనను చేర్చలేదు. చేరూరులేని ఇంగ్లీషువాని కంద తావున్నదికాని, రాయ్ బోసు వంటి వారికి తావులేదు. అనేక మంది ప్రపంచ మహాపురుషుల పేరులున్నవి కాని యొక్క హైందవుని పేరుకూడ దానిలోలేదు. జార్జి వెస్లీయను వాని చరిత్ర యున్నదికాని అశోకుని చరిత్రలేదు. అందులూథరు చరిత్ర యున్నదికాని బుద్ధుని పేరుకూడ లేదు.

ఇంక మన విద్య యెట్టిదో చూతము. హిందూస్థానములో చదువు రానివారు నూటికి ౯౨ ఇంగ్లాండులో ౨, అమెరికాలో ౫ గురు, స్కాట్లాండులో ౨. గానున్నారు.

కాని ఖర్చుల విషయము వచ్చినప్పుడు మేమే ప్రథానులము. నానాజాతి సమితి ఖర్చుల మోసికొనుటలో ఆంగ్లదేశము తర్వాత హిందూస్థానమే నగ్రస్థానమలంకరించినది. మాకు సేనలేదు. నావలులేవు. హిందూస్థానము పూర్తిగ వ్యవసాయ దేశమని చెవులు చిల్లులు పోవునట్లు చెప్పుదురు. కాని ప్రతి వ్యవసాయునకు అమెరికాలో ౪౭ ఎకరాలును ఆస్ట్రేలియాలో ౨౫ ఎకరాలును, ఆంగ్లదేశములో ౨౧ ఎకరాలును ఆఫ్రికాలో ౭ ఎకరాలును, హిందూస్థానములో 3 ఎకరాలు మాత్రమే యున్నవి.

చావులలో, జాడ్యములలో, హిందూస్థానమే యగ్రదేశము. ఇట్టి హిందూదేశమునకు గ్యారి బాల్డి వంటి ప్రచండనాయకుడు కావలెను.

గోలకొండ పత్రిక

విభవ సంవత్సర వైశాఖ బ॥ ౧

శనివారము

# ఆంధ్రసభలు

౧

అమర్దాదు ౧౬, ౧౭ ౧౮ న సూర్యాపేటలో జరుగనున్న ఆంధ్రసభలకై చురుకుగ యత్నములు జరుగుచున్నవి. అందరికి నాహ్వానము లంపుచున్నారు. ప్రేక్షకులకు తిండివసతు లేర్పఱచుచున్నారు. సభలను జయప్రదముగ జరుపుటకై శక్తివంచనలేక ఆహ్వానసంఘమువారు కృషి సలుపుచున్నారు.

ప్రస్తుతము సూర్యాపేటలో జరుగనున్న కేంద్రపరిషత్సభ, గ్రంథాలయసభ, మహిళాసభ, వర్తకసభ గత సంవత్సరముననే జరుగవలసియుండెను. కాని స్థానికయధికారుల పొరపాటుచే యవి యాగిపోయెను. ప్రజాహిత జీవనమునకెంతయో నిరోధము, నిరుత్సాహము అపచారము, జరిగెను. ఇట్టి పొరపాటు ఇక మీదటెన్నడును జరుగదని మేమాశించుచున్నాము. ఈ సభలవిషయమున జరిగిన యభియోగముపై హైకోర్టువారొసగిన తీర్పువలన, మా యీ యాశ ధృవపడి, నమ్మకముగ మారుచున్నది.

గత వత్సరమున కేంద్రసంఘసభకు సామల వేంకటరెడ్డిగారును, గ్రంథాలయ సభకు, పింగిలి వెంకట్రామారెడ్డిగారును, మహిళాసభకు పందిటి వీరరాఘవమ్మగారును, వర్తకసభకు మాశెట్టి హనుమయ్య గుప్తగారును అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. మర్యాద, ఆచారము ప్రకారము నేడుజరుగుచున్న గత సంవత్సరపు సభలకు వీరే యధ్యక్షులుగ నుండవలసి యున్నది. కాన ఆహ్వాన సంఘమువారు, వీరిని మొట్టమొదట సంప్రతించి వారి యంగీకారమును బడయవలసి యున్నది. వారు, తమతమ కార్యావసరములబట్టి యా పదవులను స్వీకరింపనిచో, ఇతరులను సమీపించవలెను.

క్రొత్త యధ్యక్షుల నెన్నుకొను సందర్భమున కొన్ని ముఖ్యమగు విషయములను గమనింపవలసియున్నది. సభలు జయప్రదముగ జరుగుటకు సభావిషయముల ప్రాశస్త్యము, ఆవశ్యము; ఆహ్వానసంఘమువారికృషి, కార్యనిపుణత్వము; సభ్యులయుత్సాహము, విజ్ఞానము, మాత్రమే కాక ఎన్నుకొనిన అధ్యక్షుని ప్రజ్ఞావిశేషములు కూడ చాలవఱకు కారణభూతములు. సభాధ్యక్షుడు సభాకార్యక్రమదక్షుడై యుండవలెను. అనావశ్య ప్రసంగములకును, అనవసర దీర్ఘోపన్యాసములకును తావొసగక సభలో కలవరముగాని, వైరభావముగాని ప్రబలకుండ, సభను వాక్చతుర్యముతో నడపి, దానినుత్సాహముతో నుప్పొంగునటుల చేయవలెను. ఇంతియేకాదు. అతడు తానాధిపత్యము వహింపబోవు సభావిషయములగూర్చి పరిపూర్ణవిజ్ఞానము గలిగినవాడై యుండవలెను. సభలో చర్చింపబోవు యంశములగూర్చి సమగ్రమగు విజ్ఞానము గడించి దానిగూర్చి స్వంతముగ నాలోచించి, యందులోని చిక్కులను విడదీసి, క్రొత్త దృక్పథములను, క్రొత్త సాధకమార్గములను జూపి యా యుద్యమమునకు జయమాపాదించువాడుగా నుండవలెను. అప్పుడే యధ్యక్షపదవి సార్థకమగును. ఇట్లుగాక యెవరినైన పలుకుబడి గలవారనియో, ధనికులనియో సభకధ్యక్షునిగ నియమించినచో ఆ సభకును, ఆసభవలన ప్రజలకును, ఆవంతయు లాభము కలుగదు.

కాన నేటి గ్రంథాలయ మహాసభకు శ్రీయుత ఠంటు సుబ్బావధాని గారిని అధ్యక్షులుగా ఎడిసినఎంతయో శ్రేయస్కరము. ఇదివరలో వరంగలులోను సంచారగ్రంథాలయ కార్యదర్శిగా నేకను. వీరు చేయుచున్న సేవ యెల్లరకు విదితమే. వీరు కాకున్న స్థానికులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారీ పదవికెంతయు అర్హులు. గోలకొండ పత్రికాధిపతిగా వీరు సలిపిన దేశసేవయు రెడ్డిగ్రంథాలయ స్థాపనమునకును వీరు చేయుచున్న యత్నములును రాష్ట్రీయులందఱకు తెలిసిన విషయమే.

ఇక మహిళాసభకు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి నెన్నుకొను టెంతయో శుభకరము. మద్రాసు రాజధానిలో స్త్రీయుద్యమమునకై పట్టుదలతో పాటుబడుచున్న వారిలో వీరొకరు. యూరపులో జరిగిన నానాజాతి నారీమణి సమితికిపోయి యచ్చటి స్త్రీయుద్యమములను వానికి సంబంధించిన విషమ సమస్యలను, తన్నివారణోపాయములను, కార్యవిధానమును నెఱిగిన విద్యావిశారద. మద్రాసు కాంగ్రెసు వారమున భారతయువతీ స్వచ్ఛంద సేవాదళమునకు నాయకురాలుగా పనిచేసిన కార్యధురీణ. ఈ విదుషీమణి, మన మహిళాసభ కధ్యక్షతవహించినచో రాష్ట్రస్త్రీల కొక యమూల్య సందేశము లభింపగలదు.

శ్రీ రుక్మిణమ్మగారు తమ కార్యావసరము లబట్టి రాజాలనిచో, శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగారిని వేడికొనవలెనని మా యూహ. దూరాచారముల ఆంధిలో కూలి, కృశించిపోవుచున్న కళావంతుల సంఘోద్ధరణమునకై యీ నారీరత్నము సలుపుచున్న యసమానకృషి కొనియాడ తరముగాదు. స్త్రీలకు ఆత్మగౌరవమును, స్వాయంసేవాదయమును, జాతీయవిజ్ఞానమును, విధివిరామము లేక గఱపుచున్న బోధకురాలు. వీరు మున్నెన్నడునే మనరాష్ట్రమునకు విచ్చేసి, సంచారము సలిపియుండిరి. ఆహ్వానసంఘమువారు వేడికొనినచో శ్రమయనక వీరు మరల మనరాష్ట్రమునకు విచ్చేసి, రాష్ట్రస్త్రీల ప్రబోధమునకెంతయో తోడ్పడుదురని మా నమ్మకము.

నేటిదే, వర్తకసంఘముయొక్క మొదటి వార్షికోత్సవము. మన హైదరాబాదు రాష్ట్రమునకు హైదరాబాదు వర్తక సంఘము [Hyderabad chamber of Commerce] అనున దొకటి కలదుగాని యదియేమి చేయుచున్నదో ఎచటనిదుర పోవుచున్నదో పౌరులకు తెలియనే తెలియదు. సూర్యాపేట వర్తకసంఘము ఇట్టి నిర్జీవమగు సంస్థగా పరిణమింపక చురుకుగా పనిచేయవలసి యున్నది. నేటి వార్షికోత్సవమునకు అధ్యక్షతవహింప దర్శి చెంచయ్య, బి. ఎస్. సి. గారెంతయు తగియున్నారని మాయభిప్రాయము. పాశ్చాత్య దేశములోని వాణిజ్య పద్ధతులను చక్కగ నెఱిగినవీరు, తమ యమూల్యోప దేశములచే సూర్యాపేట వర్తకసంఘమును ఆధునిక పద్ధతులపై నడుప ప్రోత్సహించగలరు.

కాని, ఈ నూత నాధ్యక్షులను సమీపింపక పూర్వము, ఆహ్వాన సంఘమువారు తాము గతవత్సరమెన్నుకొనిన అధ్యక్షులను సంప్రతించి వారి యభిప్రాయము తెలిసికొనవలసి యున్నదని మేమింకొకసారి హెచ్చరించుచున్నాము. వారు నేటి సభల కధ్యక్షతవహింప నిరాకరించినచో ఆహ్వానసంఘము వారు క్రొత్త అధ్యక్షులకై వెదకవలెను.

# స్థానికవృత్తాంతములు

మొహమ్మదు సాహెబు బందోబస్తుగారు తాలూకా బలోలీ. దిగులూరు, ముధోలు. మరియు స్థానా యొక్క పల్లెల పంగితులను ఈ తేదినుండి ౧౨ తేది వరకు విచారించెదరు ఇది డివిజన్, తాలూకా ముఖ్య గ్రామము అందును ప్రకటింప బడును. తాలూకా బలోలీ యొక్క విచారణ ౦ ఎ తేదునాడు తాలూకా ముఖ్య స్థలమున జరుగ గలదు.

---

నవాబు ఫాహూదు యార్ జంగు బహాదుర్, రిటైరుడు హైకోర్టు జడ్జిగారిపై సీతారామ సాహుకారు, రసిడెన్సి నివాసి, దావాచేసి డిక్రీ పొందియుండెను. తేది ౩౦ వ ఎప్రిలు నాడు సికింద్రాబాద స్టేషన్ పై నొక బెలి సివిల్ వారంటును చూపి అతని అడిషనల్ డిస్ట్రిక్టు అండు సెషన్ జడ్జి సికింద్రాబాద యొుద్దకు తీసికొని పోయెను. నవాబు సాహెబుగారు రెండు దినముల పరిమితి కోరిరి. అకాలములో దావా వాదిని సమాధాన పఱచుకుందునని చెప్పిరి. వారికి రెండు దినముల పరిమితి య్యాయ బడినది; మరియు కోర్టుయొక్క మ్యామాలీ నిగ్రాని లో నుంచుటకు కొఙ్జయినది వారిపై మూడువేల ఆఱువందల రూపాయల డిక్రీ యీయబడెను. వారు పట్టుబడుటకు ముం దున్నలవాడకు పోవుచుండిరట! వారు మూడవ మే నాడు బాకీదారుని పూర్తి రకమును చెల్లించుట వలన విడుదలబడిరి.

## మహిళా కళాశాల నాంపల్లీ

ఇచ్చట ౨౫౦ రూపాయిలవి నాల్గు సలములు ప్రత్యేకింప బడుటకు, కొఙ్జియ్యు ఇయు ఉ. జే. సి. కాని శ్రీప్రభువుగారి ఫర్మానము వలన రెండు నౌకరీలు [రు. ౨౫౦—౩౦౦] లదియు మరియు [రు. ౩౫౦—౬౦౦] లదియు మంజూరి చేయబడెను

వీనిలో నొకటి యుస్మానియా యూనివర్సిటీ తోడను, మఱియొకటి విద్యాశాఖతోను సంబంధించియుండునట

---

మార్వ్ కాదర్ సయ్యదు అబ్దుల్ కరీం సా॥ హుసేనిగారు రూ॥ ౨౦౦ నుండి ౩౦౦ రూపాయిలపై ఉస్మానియా ట్రేనింగు కాలేజీలో పనిచేయుటకును సదరు మొహ తెమీం సా॥ బల్దా మఱియు సదరు సాహెబా మదారిసు ఫోకా న్యాల సలహాతో నితరమార్క్లని గ్రాని చేయుటకును నియమింప బడిరి.

---

శ్రీనిజాం ప్రభువుగారు డిచ్‌పల్లిలో కుష్టురోగుల కౌషధాలయమును నిర్మించుటకై ముప్పది వేల రూపాయిల మంజూరీ దయచేసి యున్నారు

---

మహారాజా బహాదురుగారు సేలా స్టేషన్‌పై జేరిన తరువాత నచ్చట ఒక జాగీర్దారుడు వారికి నజరానా తెచ్చియిచ్చెను. మహారాజా బహాదుర గారు దానిని చేతితో ముట్టి మరల వాపసు తీసుకొనుమని చెప్పిరి. కాని యాతడు వినకుండుట మహారాజా గారు దానిని తీసుకొని దానధర్మము అందును, ప్రజాహిత కార్యములందును దానిని వెచ్చించుట కొఙ్జాపించిరి.

మిసెస్ ఇంగ్లర్ సదరు మొహ తెమీం మహాలిస్ నిస్వాన్ యొక్క అలవెన్సు నెల్లకు నూరు రూపాయిల చొప్పున శ్రీప్రభువుగారి ఫర్మానము వలన నాప బడి యుండెను. అది యిప్పుడు వాప బడిన తారీఖు మొదలుకొని యిచ్చుట కొఙ్జయినది.

---

కర్నలు ట్రెంచుగారి స్థలమున కాలిన్సుగారు ముస్సరముగా నియమింపబడు విషయమున నిజాం గవర్నమెంటు వారికిని కాలిన్సుగారికిని సమాధానము తెలిపి దాని ప్రకారము కాలిన్సుగారు ట్రస్కడగారి యొుద్దకు తన దస్తరమును పంపు నవసరములేదు. చక్కగా ఫధసల్ మహాయుగారి యొుద్దకే పంపవచ్చును.

కాలిన్సుగారి యారోగ్యమింకను బాగుగలేదు. వారికి మందుల కొఱకు వ్యయమువలన జీవితమునందు ౫౦౦ రూపాయిలు హెచ్చింపబడ వలయునని బాలే హుకూమతులో విచారణ చేయబడినది

(ముశీర్)

---

నవాబు మసూదుజంగు బహాదురు విద్యాశాఖ నాజముగారు జూలై నెలలో రిటైరు కానున్నారు. వారిస్థలమున నింకెవరు నియమింప బడుదురో తెలలేదు. నవాబు సిరాజుయార్ జంగ్ గారింగ్లండుకు పోవుచున్నందున నతడు నియమింప బడునని యున్నపదంతి యబద్ధమయ్యెను. ఇప్పుడిద్దరు మిమాసువారున్నారు మిస్టర్ అజమార్ హుసేన్ ఫస్టుఅసిస్టెంటు సెక్రెటరి పోలిటికల్ డిపార్టుమెంటు మరియు మిస్టర్ మహమ్మదు హుసేన్ నాయబునాజము, మిస్టర్ అబ్దుల్ రహమాన్ ఖాన్ సాహెబు ప్రిన్సిపల్ ఉస్మానియా యునివర్సిటీ కాలేజిగారు కూడ అపనికై ప్రయత్నించుచున్నారని తెలిసినది. ఒకవేళ వారే నియమింపబడుదురను అనుమానము కలదు.

---

నేటి సాయంత్రం వారముగంటలకు వివేక వర్ధని థియేటరులో పూనాలోని గొప్ప పండితుడగు రాజవాడేగా రుపన్యసించెదరు.

---

నేడు రాత్రి ఎనిమిది గంటలనుండి గౌలీగూడ శ్రీరామ మందిరమునందు పండిత తావర్ సింగు సా॥ రాగీ శ్రీఅమృతసర నివాసుగారి కీర్తన జరుగును.

---

నవాబు షమీమ్ యారు నవాజ్ జంగ్ బహాదురుగారు హజ్జునకు పోనున్నారు. కనుక అరు నెలల సెలవంగీకరింప బడినది.

## నిజాం ప్రభువుగారికి హిజ్ మేజస్టీయను బిరుదు నొసంగ వలెను

తరిగొండ, [జిల్లా వరంగల్లు] నివాసుల విజ్ఞాపన!

జిల్లా వరంగల్లులోని తరిగొండలో నొక మహాజన సభ వీరి స్వామి రెడ్డి యాజమాన్యమున రెండవ ఏప్రిల్ నాడు జరిగెను అందు తీర్మానము లామోదింప బడెను

[౧] హుజూరు నిజాంగారి "హిజ్ మేజస్టీ" యను బిరుదము నొసంగుటకై వైస్రాయి గారిని కోరుట.

[౨] మసులీపట్నం, బరారు ఇలాకా నిజాం గారికి యిచ్చుట.

[రయ్యతు]

---

# హైదరాబాదు

## బజారు ధరలు

వేలూరి లింగయ్య అండ్ సన్సు,

వర్తకులు, కమిషన్ ఏజెంట్లు

ఉస్మానుగంజ హైదరాబాదు (దక్కన్)

ధరలన్నియు హోలీలు.

పల్లా—౧౨౦ సేర్లు తూకం.

సేరు—౨౪ తులములు.

---

వైశాఖ బ॥ ౧

| | |
|---|---|
| కందిపప్పు | రు॥ ౨౫ ౭ ౦ |
| అంకపప్పు | ౧౪ ౧౩ ౦ |
| మినుపపప్పు | ౨౨ ౪ ౦ |
| పెసర పప్పు | ౨౬ ౭ ౦ |
| శెరిశెనగ పప్పు | ౨౧ ౦ ౦ |
| శెనగపప్పు | ౨౦ ౦ ౦ |
| జలాలియా గోధుమలు | ౨౫—౨౨ ౦ ౦ |
| పిశీగోధుమలు | ౨౧ ౦ ౦ |
| శరబతిగోధుమలు | ౨౨ ౦ ౦ |
| బశ్సిగోధుమలు | ౨౪—౨౩ ౦ ౦ |
| మక్కగోధుమలు | ౧౭ ౦ ౦ |
| నాశకరాంబియ్యము కొ॥ | ౨౩ ౦ ౦ |
| నావకరాం ,, పా॥ | ౨౭—౩౦ ౦ ౦ |
| ఉల్లిగడ్డ | ౪ ౭ ౦ |
| ఎల్లిగడ్డ శే౧౨ | ౩ ౪ ౦ |
| మంచినూనె శే౧౨ | ౬ ౨ ౦ |
| రాలా | ౯ ౦ ౦ |
| పిపోడిబియ్యము | ౪౦—౫౦ ౦ ౦ |
| దారుకోటుబియ్యము పాతవి | ౨౪—౨౭ ౦ ౦ |
| అంకలు మందం | ౧౨ ౧౨ ౦ |
| శెనగలు మందం | ౧౫ ౧౩ ౦ |
| పులుపులు | ౧౦ ౪ ౦ |
| ధనియాలు శే౧౬ | ౬ ౧౨ ౦ |
| వెండి తు ౧౦౦ | ౯౦ ౦ ౦ |
| బంగారంతు॥౧ కి | ౨౬ ౧౨ ౦ |
| సావరిను | ౧౩ ౧౦ ౦ |
| నోట్లు | ౧౪ ౧ ౦ |
| హుండి | ౧౬ ౧౪ ౦ |
| ఫ్యాకటరీ బియ్యము | ౨౧ ౭ ౦ |
| అకుసన్న బియ్యము | ౨౩ ౦ ౦ |
| గవుడబియ్యము | ౧౯ ౦ ౦ |
| తెల్ల జొన్నలు | ౧౨ ౦ ౦ |
| పచ్చజొన్నలు | ౯ ౧౨ ౦ |
| సజ్జలు | ౧౦ ౭ ౦ |
| మినుములు | ౧౪ ౪ ౦ |
| నెయ్యి శే ౪౦ | ౬౫ ౦ ౦ |
| సన్నమిరిచి కొత్తవి | ౩౦—౪౧ ౦ ౦ |
| చింతపండు కొ॥ | ౨౯ ౦ ౦ |
| కొలి గోతాలు చ॥ ౧౦౦ | ౫౨ ౦ ౦ |

## గ్రామ సమాచారములు

## ఎఱుకల బాలుర పాఠశాల

(సికింద్రాబాదు)

శ్రీ దండీస్వామిగారు తెఱచుట

(స్వకీయ విలేఖరి)

ఆదివారము సాయంకాలము ౫½ గంటలకు పికెట్టులో ఎఱుకల గూడెములో ఎఱుకల వారికై యొక పాఠశాల తడకలతో నిర్మింపబడి యుండెను. ఆ పాఠశాల పర్ణశాల రీతిగా నున్నది. ఇది మానవ సేవా సభ్యుల పక్షమున నిర్వహింప బడుచున్నది. ఈ పాఠశాలను ఆదివారమునాడు శ్రీ దండిస్వామిగారు తెఱచిరి. సభకు శ్రీ పండిత కేశవ రావుగారును శ్రీ వామన నాయకు గారును, సికింద్రాబాదు పౌరులు ననేకులు విచ్చేసియుండిరి.

శ్రీ దండీ స్వామిగారు ౧ గంట కాలము హిందూమతమును గుఱించియు, విగ్రహారాధన యొక్క శ్రేష్ఠత్వమును గురించియు నుపన్యసించిరి. పిమ్మట వారు ఎఱుకలవారి విషయమున శ్రద్ధ వహించిన వారి నందఱను వేర్వేరుగా ప్రశంసించిరి. వారి పిమ్మట వామన నాయకుగారు అర్ధ గంటకాల ముపన్యసించిరి. క్రైస్తవులు తమ మతములోనికి నితరులను చేర్చుకొనుటలో నెన్నియో యుపాయములను చేయుచున్నారనియు, గోవాలో పూర్వము బావులలో బిస్కెట్టులను బారవేసి యా నీరు త్రాగిన వారందఱు క్రైస్తవులైరని చెప్పుచుండిరనియు మూర్ఖులగు హిందువులు కొందఱు దానిని విశ్వసించు చుండిరనియు చెప్పిరి. ఎఱుకలవంటి జాతులను నుద్ధరించుటను గుఱించి వీరు జనులకు ప్రోత్సాహ పఱచిరి. మఱియు తాము ౧౦౦ రూపాయలును, తాత్యారావుగారు (బి. ఎ. బి. ఎల్) ౧౦౦ రూపాయిలను పండిత కేశవరావుగారు ౫౦ రూపాయిలు నిచ్చిరి. మఱియు నితరులనేకులు కూడ చందా లిచ్చిరి. ఆరు నెలలకు స్కూలు ఉపాధ్యాయులకని ౧౨౦ రూపాయిలు యిచ్చుటకు వాగ్దానము చేసిన శ్రీ సురవరము రంగా రెడ్డిగారిని శ్రీ వామను నాయకుగారు ప్రశంసించిరి.

ఎఱుకు బాలురకు మిఠాయి పంచిపెట్ట బడెను. సభ రాత్రి ౭ గంటలకు ముగిసెను.

## సూర్యాపేట

### సర్వీసు మోటారులు—డ్రైవరుల దుండగములు

కొర్ల గంపలను చెఱకు మోపులకు కౌగలించుకొని ప్రయాణికులు కూర్చొన వలెను

సూర్యాపేటనుండి నల్లగొండకును, ఖమ్మంమెట్టుకును వచ్చే సర్వీసువారి మోటారులు సక్రమముగా నడచు చున్నది. కాని ప్రయాణీకుల యిబ్బందికిని డ్రైవరు దుండగములకును మితిలేదు. మోటారుల నెక్కవలసిన జనులకు మితియున్నను, యెక్కు వారికి మితిలేదు. నలుగురు కూర్చొన వలసిన మోటారులో నొక్కొకసారి యిరువది మందిని సహితము నెక్కించుకొని మోటారులో కూర్చొన వలసినంత మంది కూర్చొనిన పిమ్మట తరువాత వచ్చినవారి విషయములో మెంబరు వారంగీకరించినచో కూర్చుండ బెట్టుట కొంతవరకు సమంజసమే. కాని ప్రయాణీకుల స్వేచ్ఛను పాటింపక, కడుపె కైలాసమని, డబ్బు ప్రోగుచేయుటే తమ విధియని వచ్చినవారి నందరిని ప్రెస్సులో బిగించి నట్టునెట్టుట చాల విచారణీయము. రెండవ సర్వీసు వారి పోటీ లేకపోవుటచే ప్రజలకీగతి పట్టినది. ప్రయాణీకుల దురవస్థలంతటితో దీరలేదు. సర్వీసు మార్గములోని గ్రామాదులకు పర్యటనార్థము విచ్చేయు యధికారుల యొక్క కోళ్ల గంపలును, వంట చెఱకుల మోపులును ప్రయాణీకులకు తోడు నీడలై వారితో పాటు మోటారులో ప్రయాణము సల్పును. మోటారు డ్రైవరులు స్థానికాధికారులకు యెప్పుడేరాత్రి యెన్నటి ప్రయాణము సలుప దలచినను వారి యింటి ముందరకు తీసుకవచ్చి విడుతురు. వారికి కావలసిన వస్తువుల రోజా రోజూ ఖమ్మం, నల్లగొండనుంచి తెచ్చి యిత్తురు. కిరాయ యిత్తురో లేదో తెలుప జాలము. యేటులైననేమి మోటారు వారిపై స్థానికాధికారులకు యనుగ్రహము మెండు. అందువలన వారి డ్రైవరుల దుండగములకు మితిలేక పోవుటయే గాక సదా యెన్నియో క్రూర కార్యముల జరుపు చుందురు.

### సూర్యాపేట సభలు

యిచట తీరు నెలలో జరుగనున్న సభలలోని భజన సమాజ వార్షికోత్సవ సభకు శ్రీయుత వేలూరి రంగధామ నాయుడుగారు యగ్రాసనాధిపత్యము వహించ నంగీకరించినట్లు తెలియుచున్నది.

పారిశ్రామిక, పరిషత్ సంఘాధిపతులగు మిస్టరు కాళెన్న దొరగారు యాహ్వాన సంఘమువారి కోరికపై సభలలో నుపన్యసించుటకై తమ సంఘపక్షమున నొక యుపన్యాసకుని బంప నంగీకరించినట్లు పవచ్చు చున్నది.

### శీతోష్ణ స్థితి

యెండలు తీవ్రముగా నున్నవి, కొలది దినములలో నీటికి యిబ్బంది జరుగునట్లు తోచుచున్నది.

## మరాట్వాడీ వార్తలు

### పైఠణు

కవులులో జనులకిచ్చిన తకావి రకమెంకసారి వసూలు చేసి కూడ యిప్పుడు మఱల వసూలు చేయుచున్నారు. కొందఱి వద్ద రసీదులుకూడ నున్నవి. కాని వాని బాకీలా దఫ్తరులో లేనందున వానిని లేజాబితాయని చెప్పి మఱల వసూలు చేయుచున్నారు. మరల డబ్బుకట్టక సర్కారుతో విరోధముజేయ నెవరు సిద్ధపడుదురు. అధికారులు డబ్బు మ్రింగినచో దానికై రైతు కాపులకేల యీ శిక్ష!

### కళంబు

ఇక్కడి ముస్తకిల్ తహసీలు దారుగారగు మీర్ ముహబ్బు అలీఖాను సాహేబుగారు సెలవులు తీసుకొనినందున వారి స్థానమున తాలుక్దారీ మాలులోని పేష్కారులగు శ్రీయుత క్రిష్ణా రావుగారు నియమింపబడిరి. పనులు సమాధాన కారకములుగ జరుగుచున్నవని ఒక విలేఖరి తెలుపుచున్నాడు.

### గళగుండ

ఇచ్చటి తహసీలు దారును, మదదుగారు మాలును, ఆగు మౌలానా నసీరుద్దీన్ ఖాన్ గారిని మూడు నెలల వరకు సెలవులు చేసినందున, ఆతని స్థానమున హూనూర్ నగరపు తహసీల్దారు గారగు మీర్ గులాం మహమ్మదు ఖాన్ గారు పని చేయుదురు. మీర్ గులాం మహమ్మదు ఖాన్ గారి పని నిచ్చటి పేష్కారు గారు చూతురు.

### నిజామాబాదు

ప్రోగ్రాము ప్రకారము కిషన్ ప్రసాదు గారిచ్చటికి దయచేసి డిచపల్లిలోని దవాఖానాను గాంచిరి. నరసా గౌడుగారు వారిచేత ౫౦౦ రూపాయిల బట్టలు పంచిపెట్టిరి. అక్కడియొక మహారాష్ట్ర పాఠశాలకు సహాయము చేసెదమని చెప్పి నాందేడుకు పోయిరి.

(నిజాము విజయ)

## విశేషములు

### ఆకాశ పర్యంత సౌధము

పూర్వము మన కవులు పురవర్ణన చేయునప్పుడు బంగ్లాలాకాశమునంటినవని వర్ణించిరి. దానిని ఉత్ప్రేక్షాలంకారమనుచుండిరి. ఇప్పుడు అమెరికాలో ఆ వర్ణనలకు తగినట్టి సౌధములున్నవి. న్యూయార్కు పట్టణములో ఒక బంగ్లా ౫౭ అంతస్థులది యున్నది. దీనిలో యెల్లప్పుడును సుమారు ౧౫ వేల మంది నివసించుచుందురు. దీనిలోనికి వచ్చిపోవు వారి సంఖ్య ప్రతి దినము ౧ లక్ష ౫౭ వేల మందికి తక్కువ యుండదు. ఇంత యెత్తైన బంగ్లాపైకి క్రిందికి యెక్కిదిగుట దుస్సాధ్యము. కావున దీనిలో ౭౭ ఎలెక్ట్రిక్ డబ్బాలు (లిఫ్ట్) ఉన్నది. వీటిలో నిలిచినంతనే యుపరికి పోవును. ఈ డబ్బాలలో ప్రతి దినము ఎక్కి దిగువారి సంఖ్య సుమారు ౯౫ వేలని లెక్కింపబడినది. ఈ బంగ్లా వైశాల్యము ౭ కోట్ల ౫౦ లక్షల చదరపు టడుగులు. ఇందు ప్రతిదినము ౬౫ వేల జాబులు వచ్చుచుండును. మరియు ౨౫ వేల పార్సెల్లు జాబులు ప్రతిదినము బయటకు బంపబడును.

ఈ బంగ్లాకు ౫ వేల కిటికీలును, ౧౦ వేల ద్వారములునున్నవి. మరియు దీనిలో ౧౫ వేల విద్యుద్దీపములున్నవి.

### అపూర్వ గ్రంథములు — అపూర్వపు ధరలు

అండములో ఒకరు ప్రాత గ్రంథములను అమ్మి మూడు గంటలలో ౧౦ లక్షల రూపాయీలు సంపాదించెను.

౩౦౦ సంవత్సరముల క్రిందట "వర్జీనియా న్యాయ చట్టములు" అను గ్రంథమును విక్రయించు వాని పూర్వికుడు ౯౦ ఏండ్ల క్రిందట ౩౦ రూపాయీలకు కొని యుండెను. దానినిప్పుడు ౧ లక్ష రూపాయీలకమ్మెను.

క్రీ. శ. ౧౬౧౦ లో అచ్చుఅయిన "వర్జీనియా వార్తలు" అను గ్రంథమును గూడ ౧ లక్ష కమ్మెను.

వర్జీనియా చరిత్రము గ్రంథముకూడ ౧ లక్షకు విక్రయింపబడెను.

### విచిత్రమగు పుస్తకములు

#### మనుష్యుల చర్మములచే బైండు చేయబడినవి

ప్రపంచములో ననేక రీతుల పుస్తకములు వెలువడి యున్నవి. కొన్ని ఒక అంగుళము వైశాల్యము కలిగియున్నవి. అనగా ఒక తపాల టికెటుపై వైశాల్యమంతటివి యున్నవి. కొన్ని చాల పెద్దవియున్నవి. ఒక ఖురాను గ్రంథము ౫ అంగుళముల పొడవును ౩ అంగుళముల వెడల్పును ౧ అంగుళమందమును కలిగి యున్నది. ఒక పుస్తకమంతటిలో ఒకే పంక్తి యున్నది. కొన్ని పుస్తకములు ఆంగ్లదేశములో నినుపరేకులతో కట్టబడి యున్నవి.

ఇంక జంతువుల చర్మములతో బైండు చేసిన గ్రంథములు అందరును చూచి యున్నారు. కాని మనుష్యుల చర్మములతో బైండు చేయుదురనిన యెవ్వరైన నమ్ముదురా! అయినను అట్టివి కూడ కలవు. ఆంగ్ల దేశములో యార్కుషైరు మంత్రశాస్త్రి యొక్క చర్మముతో బైండు చేసిన యొక పుస్తకమున్నది. ఇంకొకటి యొక హంతకుని చర్మముతో చేయబడినది. ఒక స్త్రీ చచ్చి పోవుచు తన చర్మమును నొక గ్రంథకర్త యధీనముగా నేర్పాటు చేసిపోగా నా చర్మముతో నాతడు జ్ఞాపకార్థమై పుస్తకము బైండు చేయించెను. కొన్ని గ్రంథములు అమూల్యపు పీపముపై అచ్చువేయబడినవి యున్నవి.

## జాబులు

## భారతకృషి.

గోలకొండ పత్రికాధిపతిగారికి

ఆర్యా! ఈలేఖను దయతో తమపత్రికలో ప్రకటింప వేడుచున్నాను.

భారతకృషి యను నొక వ్యవసాయ విషయ మాసపత్రికను ప్రచురింపదలచి, ప్రయత్నించుచున్నాము. ఇట్టి పత్రికను ప్రచురించుటకుగాను చట్టసమ్మతముగ ప్రభుత్వాజ్ఞను పొందుటకు, త్వరలో క్రమముగ చర్య నవలంబింపబడును. ఎంతశీఘ్రముగా కృషిసలిపినను, మేము ఈ విషయమందు కృతార్థులమగుటకు, కాదా పు ౕ మాసముల కాలమవసర మగునని, మాస్వల్పాను భవమువలన, విశ్వసించుచున్నాము. ఈ విషయమును గురించి, ఇదివరకే దాదాపు రెండుసంవత్సరముల నుంచి ప్రయత్నింపబడుచున్నాము. కాని విధివశమున నైనోపహతులమై, ఊరకుండవలసి వచ్చెను. మా ప్రయత్నము ఫలోన్ముఖము కాక పోవుటవలన, మా సంకల్పముకైనను, ప్రచురించుటకు సమ్మతింపమైతిమి. ప్రస్తుతము మరియొక మారు ప్రయత్నించి, సంకల్పసిద్ధిని పొందుటకు గడంగుచున్నాము.

వ్యవసాయపు హీనస్థితియే మా ప్రోత్సాహమునకు కారణమైనది. ఆంధ్రసోదరాభ్యుదయాభిలాషులేమాకు సహాయకారులు, ప్రభుత్వసముద్దేశమే, మాకనుకరణీయాంశము. కావున ఆంధ్రసోదరులును, ప్రభుత్వమువారును, మాకు చేయూతనొసగి, వ్యవసాయాభ్యున్నతికి, కారకులుగా గోరుచు, ప్రార్థించుచున్నాము. భగవంతుడు మాకృషిని ఫలప్రదముగా జేయుగాక!

ఇదివరకు మేము, వ్యవసాయవిషయమునందు నిరుత్సాహులమైతిమి. మాయందెంత మాత్రదేశభక్తి. స్వదేశీయులగు రైతుల హీనస్థితివలన కలిగిన పరితాపము ఎంత్రిమ; మమ్ములను వదలిపోజాలదయ్యెను. ఇంటింటం జెపను, యూరపరేశకు, మాయభాను శక్తిగ కృషికుల విషయమునందు ... బుద్ధిని పురిచితిమి.

'వ్యవసాయము; తొలిపలుకు' అను నొక వ్యవసాయ ప్రాథమిక విషయబోధకమగు గ్రంథమును వ్రాసి, సిద్ధపరచియున్నాము. ఆగ్రంథమునందు, వ్యవసాయపుభూములు, వ్యవసాయపు పోషకము, వ్యవసాయశాస్త్ర, వ్యవసాయ విజ్ఞానమును గూర్చి తీక్ష్ణమముగ వ్రాయబడియున్నది. ఈ పుస్తకము, నొక ఉర్దూభాషా గ్రంథమునుంచి, అవసరములగు కొన్ని మార్పులతో, వ్రాయబడిన. అను వాదగ్రంథమన వచ్చును. వీలైనంత త్వరలో ప్రకటించుటకు గూడ ప్రయత్నించెదము. నేడే గోలకొండ, కోహినూరు ముద్రాలయాధికారులకు, ముద్రణను గురించి, వ్రాయుచున్నాము. వారు గూడ మాయుద్యమమును కనికరించి, ప్రోత్సాహ మొసగవలయునని, కోరుచున్నాము ఆంధ్రసోదరులుగూడ, విషయము నే ప్రధానముగా నెంచి, మాగ్రంథము నాదరింతురుగాక.

ఇదిగాక వ్యవసాయమును గురించి, మరికొంత గూడా ప్రయత్నించుచున్నాము. ఫలవృక్షముల వ్యవసాయమునందు, నొక్కొక్క ఫలవృక్షమును గురించి వేరువేరుగా లఘుపుస్తకములు, ప్రకటింప దలచి, అనేక విషయములు సేకరింప బడియున్నవి. ఆర్థికాభావమువలన, ఇంతవరకాలపు పుస్తకములను, ప్రకటించుట కనువుకాదయ్యెను.

భగవంతు డెను గ్రహించెనేని మాయుద్యమము చిరకాలమునకే, సంతతాభివృద్ధి నొందుట కవకాశముగలదు. ఆంధ్ర సోదరులారా! ఘనత వహించిన ప్రభుత్వమా! మా ప్రార్థనమున కభిముఖులు గాగోరుచున్నాము. దీన దయాళో! మాదీనత్వమును, సోదరుల హైన్యస్థితిని బాపుట, కనుగ్రహింతువుగాక!

ఇట్లు భారతకృషి యభ్యుదయాభిలాషి,
ఎస్. ఆర్. రావు.

---

శ్రీ లక్ష్మీ నారాయణ మోటారు స్టవు.

కొలిపాక ఎ. ...

## కావలెను

గోలకొండ పత్రికా కార్యాలయమునకు ఇద్దరు తెనుగు కంపాజిటరులు కావలెను. దరఖాస్తుదారులు స్వయముగ మేనేజరుతో మాట్లాడవలెను. జీతము పనినిబట్టి యుండును.

మేనేజరు
గోలకొండ పత్రికాలయము
ట్రూపుబజారు
హైదరాబాదు.

REG No N. 45. REG. No. M. 2185

గోలకొండ పత్రిక

ట్రూపుబజారు హైదరాబాదు, దక్కను

సంవత్సరము చందా రు. ౭-౦-౦

అర్ధసంవత్సరము ,, ,, ౩-౧౨-౦

విడి ప్రతి ౦-౧-౮

శ్రీయుత

STAMP.

Printed and Published by K. Balakrishna Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad Dn